# ప్రాతిపదిక విద్య

## ప్రశ్నోత్తరములు




భారత ప్రభుత్వ
సమాచార, ప్రసార మంత్రాంగపు
ప్రచురణ విభాగము

# ఉపోద్ఘాతము

విద్యయొక్క ఆశయమేమిటి? 1937 సం॥ జులైలో ప్రచురించబడిన "హరిజన్" పత్రికలో తనచే వ్రాయబడిన ఒక వ్యాసములో గాంధీజీ, "బిడ్డలందు సహజముగావుండే శారీరిక, మానసిక, ఆధ్యాత్మికశక్తుల సర్వతోముఖవికాసమే విద్యయొక్క పరమాశయము" అని పేర్కొన్నారు.

విద్యను గురించి వ్రాయబడిన ఈ వ్యాసము, ఆ రోజులలో విద్య విషయమై ప్రజలకు గల అభిప్రాయములందు విశేషమైన మార్పులకు దారితీసింది. ప్రజలతో తనకు గల సన్నిహితత్వము, జీవితానుభవముల ఆధారముగా గాంధీజీ మనదేశ గ్రామీణ ప్రజల అవసరాలకు అన్నివిధములా అనుగుణమైన విద్యావిధానము యే విధముగా వుండాలో కొన్ని సూచనలు చేశారు. కృషిద్వారా అభ్యసించబడునదే యదార్థమైన విద్య యని గాంధీజీ విశ్వసించారు.

హరిజన్ పత్రికలో గాంధీజీ వ్రాసిన వ్యాసములు ప్రచురించబడిన అచిరకాలముననే వార్ధాలో వివిధరాష్ట్ర విద్యామంత్రుల, విద్యావిషయిక కార్యకర్తల సమావేశమొకటి యేర్పాటుచేయబడింది. ఈ సందర్భములో జరిగిన చర్చల ఫలితముగా డాక్టరు జకీర్ హుస్సేన్ అధ్యక్షతన సంఘమొకటి నియమించబడి, గాంధీజీ సూచనల ఆధారముగా ఒక పథకమును, పాఠ్యవిషయముల పట్టికను తయారుచేయవలసిందిగా విజ్ఞప్తి చేయబడింది. "ప్రాతిపదిక జాతీయ విద్యావిధానము" అను పేరుతో ప్రచురించబడిన ఈ సంఘపు నివేదికయందలి ముఖ్యమగు సిఫార్సులు దిగువ నివ్వబడినాయి.

(1) దేశమందలి బాలబాలికలకందరికీ ఏడుసంవత్సరముల పాటు ఉచిత, విధాయక విద్యాబోధన ఇవ్వబడాలి;

(2) విద్యాబోధన మాతృభాషలోనే జరగాలి;

(3) విద్యాబోధన సృజనాత్మకమైన యేదో ఒక చేతిపని ఆధారంగా జరగాలి;

(4) ఉపాధ్యాయుల జీతాల చెల్లింపు కవసరమైన సొమ్ము సాధ్యమయినంతవరకు విద్యార్థుల చేతిపనులనుండి లభించునట్లు వుండాలి.

పై నివేదిక వెలువడిన అచిరకాలముననే, "ప్రాతిపదిక జాతీయ విద్యావిధాన వ్యాప్తికి తగిన కార్యక్రమమును రూపొందించడానికి" హిందూస్తానీ తాలిమీ సంఘమనే అఖిలభారత సంస్థ ఒకటి యేర్పాటుచేయబడింది.

వార్ధా పథకము జయప్రదముగా అమలుజరగడంతో కేంద్ర విద్యా సలహా సంఘము దాని ప్రాముఖ్యతను గుర్తించి, శ్రీ బి. జి. ఖేర్ అధ్యక్షునిగా ఒక సంఘమును నియమించి, వార్ధా పథకము యొక్క సాధ్యతలను గురించి పరిశీలించవలసిందని విజ్ఞప్తి చేసింది. శ్రీ ఖేర్ సంఘము ఈ విషయమై కూలంకషగా పరిశీలనలు జరిపి వార్ధా పథకము పూర్తిగా విద్యాసంబంధమైనదేనని, వస్తూత్పత్తితో దీనికేమాత్రం సంబంధము లేదని ప్రజలకు స్పష్టం చేసిది.

"కృషిద్వారా విద్యాభ్యసనం" అనే సూత్రమును స్థూలముగా ఆమోదించిన శ్రీ ఖేర్ సంఘము చేసిన సిఫార్సులలో ముఖ్యమైనవి దిగువ నివ్వబడినాయి.

(1) ప్రాతిపదిక విద్యావిధానము మొదట గ్రామీణ ప్రాంతములందు ప్రవేశపెట్టబడాలి.

(2) ఈ విధానము ప్రకారము విద్యనభ్యసించే బాలబాలికలు కనీసం 6 సంవత్సరముల వయస్సుగలవారై యుండాలి. వీరికి సుమారు 7 సంవత్సరములపాటు ఈ విధాన ప్రకారము

విద్య గరుపబడాలి. ప్రత్యేక సందర్భాలలో 5 సంవత్సరముల వయస్సుగల పిల్లలుగూడ చేర్చుకొనబడవచ్చును.

(3) ప్రాతిపదిక పాఠశాలలనుండి యితర రకపు పాఠశాలలకు విద్యార్థులు మార్చుకొనే అవకాశం 5 వ తరగతి పూర్తియైన తరువాతనే యివ్వబడాలి.

(4) ప్రాతిపదిక విద్యాబోధన మాతృభాషలోనే జరగాలి.

ప్రాతిపదిక విద్యావిధానమును, ఉన్నత విద్యావిధానముతో సమన్వయపరచు నిమిత్తము శ్రీ ఖేర్ అధ్యక్షుడుగా మరియొక సంఘము నియమింపబడినది. ఈ రెండింటి సిఫార్సులు కేంద్ర విద్యా సలహాసంఘముచే ఆమోదించబడి, 1944 లో ప్రచురించబడిన "యుద్ధానంతర విద్యాభివృద్ధి" అనే నివేదికలో ఈ సిఫార్సులన్నీ చేర్చబడినాయి. ఈ నివేదికయందలి అంశములన్నింటికీ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు తమ ఆమోదమును తెలిపినాయి. వార్ధా పథకమునకు, ఈ నివేదికకు ఒకే ఒక అంశములో వ్యత్యాసమున్నది. ప్రాతిపదిక పాఠశాలలో విద్యార్థులచే తయారుచేయబడే వస్తువుల విక్రయంద్వారా లభించే సొమ్ము సాధ్యమయినంతవరకు ఉపాధ్యాయుల జీతాలకు సరిపోవునట్లుండాలని వార్ధా పథకము నిర్దేశించగా, అది సాధ్యపడక పోవచ్చునని ఈ నివేదిక భావించింది.

భారతదేశమువంటి పేదదేశమునకు ఆచరణయోగ్యమైనదీ, అన్నివిధములా అనుగుణమైనదీ ప్రాతిపదిక విద్యావిధానమేనని ప్రముఖ విద్యావేత్తలనేకులు అంగీకరించారు. ఈ విద్యావిధానం ప్రకారం విద్య నభ్యసించే బాలబాలికలందు ఆత్మవిశ్వాసము పెంపొంది, భావిపౌరులుగవారు తమ విధులను, హక్కులను సవ్యముగా వినియోగించగల శక్తిసామర్థ్యాలు యేర్పడుతాయి. సృజనాత్మకమైన యేదో ఒక చేతిపని ఆధారంగా విద్యను గరపడమే ప్రాతిపదిక విద్యావిధానముయొక్క విశిష్టత. నిష్ణాతులయిన

(2) విద్యాబోధన మాతృభాషలోనే జరగాలి;

(3) విద్యాబోధన సృజనాత్మకమైన యేదో ఒక చేతిపని ఆధారంగా జరగాలి;

(4) ఉపాధ్యాయుల జీతాల చెల్లింపు కవసరమైన సొమ్ము సాధ్యమయినంతవరకు విద్యార్థుల చేతిపనులనుండి లభించునట్లు వుండాలి.

పై నివేదిక వెలువడిన అచిరకాలముననే, "ప్రాతిపదిక జాతీయ విద్యావిధాన వ్యాప్తికి తగిన కార్యక్రమమును రూపొందించడానికి" హిందూస్తానీ తాలిమీ సంఘమనే అఖిలభారత సంస్థ ఒకటి యేర్పాటుచేయబడింది.

వార్ధా పథకము జయప్రదముగా అమలుజరగడంతో కేంద్ర విద్యా సలహా సంఘము దాని ప్రాముఖ్యతను గుర్తించి, శ్రీ బి. జి. ఖేర్ అధ్యక్షునిగా ఒక సంఘమును నియమించి, వార్ధా పథకము యొక్క సాధ్యతలను గురించి పరిశీలించవలసిందని విజ్ఞప్తి చేసింది. శ్రీ ఖేర్ సంఘము ఈ విషయమై కూలంకషగా పరిశీలనలు జరిపి వార్ధా పథకము పూర్తిగా విద్యాసంబంధమైనదేనని, వస్తూత్పత్తితో దీనికేమాత్రం సంబంధము లేదని ప్రజలకు స్పష్టం చేసిది.

"కృషిద్వారా విద్యాభ్యసనం" అనే సూత్రమును స్థూలముగా ఆమోదించిన శ్రీ ఖేర్ సంఘము చేసిన సిఫార్సులలో ముఖ్యమైనవి దిగువ నివ్వబడినాయి.

(1) ప్రాతిపదిక విద్యావిధానము మొదట గ్రామీణ ప్రాంతములందు ప్రవేశపెట్టబడాలి.

(2) ఈ విధానము ప్రకారము విద్యనభ్యసించే బాలబాలికలు కనీసం 6 సంవత్సరముల వయస్సుగలవారై యుండాలి. వీరికి సుమారు 7 సంవత్సరములపాటు ఈ విధాన ప్రకారము

విద్య గరుపబడాలి. ప్రత్యేక సందర్భాలలో 5 సంవత్సరముల వయస్సుగల పిల్లలుగూడ చేర్చుకొనబడవచ్చును.

(3) ప్రాతిపదిక పాఠశాలలనుండి యితర రకపు పాఠశాలలకు విద్యార్థులు మార్చుకొనే అవకాశం 5 వ తరగతి పూర్తియైన తరువాతనే యివ్వబడాలి.

(4) ప్రాతిపదిక విద్యాబోధన మాతృభాషలోనే జరగాలి.

ప్రాతిపదిక విద్యావిధానమును, ఉన్నత విద్యావిధానముతో సమన్వయపరచు నిమిత్తము శ్రీ ఖేర్ అధ్యక్షుడుగా మరియొక సంఘము నియమింపబడినది. ఈ రెండింటి సిఫార్సులు కేంద్ర విద్యా సలహాసంఘముచే ఆమోదించబడి, 1944 లో ప్రచురించబడిన "యుద్ధానంతర విద్యాభివృద్ధి" అనే నివేదికలో ఈ సిఫార్సులన్నీ చేర్చబడినాయి. ఈ నివేదికయందలి అంశములన్నింటికీ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు తమ ఆమోదమును తెలిపినాయి. వార్ధా పథకమునకు, ఈ నివేదికకు ఒకే ఒక అంశములో వ్యత్యాసమున్నది. ప్రాతిపదిక పాఠశాలలో విద్యార్థులచే తయారుచేయబడే వస్తువుల విక్రయంద్వారా లభించే సొమ్ము సాధ్యమయినంతవరకు ఉపాధ్యాయుల జీతాలకు సరిపోవునట్లుండాలని వార్ధా పథకము నిర్దేశించగా, అది సాధ్యపడక పోవచ్చునని ఈ నివేదిక భావించింది.

భారతదేశమువంటి పేదదేశమునకు ఆచరణయోగ్యమైనదీ, అన్నివిధములా అనుగుణమైనదీ ప్రాతిపదిక విద్యావిధానమేనని ప్రముఖ విద్యావేత్త లనేకులు అంగీకరించారు. ఈ విద్యావిధానం ప్రకారం విద్య నభ్యసించే బాలబాలికలందు ఆత్మవిశ్వాసము పెంపొందు, భావిపౌరులుగవారు తమ విధులను, హక్కులను సవ్యముగా వినియోగించగల శక్తిసామర్థ్యాలు యేర్పడుతాయి. సృజనాత్మకమైన యేదో ఒక చేతిపని ఆధారంగా విద్యను గరపడమే ప్రాతిపదిక విద్యావిధానముయొక్క విశిష్టత. నిష్ణాతులయిన

ఉపాధ్యాయులుంటే ఈ విద్యావిధానమువల్ల మంచి ఫలితములను సాధించ వీలున్నది. గాంధీజీ యెంతగానో ఆశించిన సహకార సామాజిక వ్యవస్థను యేర్పాటుచేసి, అట్టి వ్యవస్థయొక్క సర్వతో ముఖాభివృద్ధికి సహాయపడగల పౌరులను తయారుచేయుటలో యీ విధాన మెంతైనా తోడ్పడగలదు.

"కృషిద్వారా విద్యాభ్యసనం" అనగా సామాన్యవిజ్ఞాన మును ఆర్జించుటతోబాటు, యేదో ఒక చేతిపనియందు ప్రావీణ్యా తను సంపాదించడమే గాదు; మానవక్రియాకలాపములతోనూ, అభిరుచులతోనూ సహజమైన పారస్పర్యసంబంధముగల యేదో ఒక చేతిపని ఆధారముగా విద్యను గరపడమేనని గ్రహించాలి. దీనినే మరొక విధంగా చెప్పితే "చేతిపనిలో సహజముగా వుండే సాధనశక్తులను విద్యావిషయిక కలాపముల నిమిత్తం చక్కగా వినియోగించుకొనడమే," ప్రాతిపదిక విద్యావిధానమందలి విశిష్టత. కేవలం సాహిత్యవిషయపూర్వకమైన విద్యావిధానముకన్న బిడ్డల సంకల్పము, యేకాగ్రతలమధ్య చక్కని సమన్వయమును సాధించ గల ప్రాతిపదిక విద్యావిధానమువల్లనే బిడ్డల వ్యక్తిత్వము సర్వతో ముఖవికాసమును పొందగలదని ప్రత్యేకించి చెప్పనవసరంలేదు.

ప్రాతిపదిక విద్యావిధానమునకు సూత్రప్రాయముగా సర్వ జనాంగీకారము లభించినది. అయినా ఈ విధానమునకు సంబం ధించిన కొన్ని అంశములను గురించి, లక్షణాలను గురించి, సందే హములు, శంకలు వ్యక్తముచేయబడినవి. వీనికి సరియైన సమా ధానముల నివ్వడానికి ఈ పుస్తకమందు ప్రయత్నం జరుపబడింది. ప్రాతిపదిక విద్యావిధానపు ముఖ్యలక్షణము లేవో, దాని ఆశయము లెట్టివో, అది యే విధముగా ఆచరణయోగ్యమో మొదలగు విషయాలను గురించి యిదివరకే విశేషముగా రచనలు చేయబడి నవి కాబట్టి వానిని గురించి యిందు ప్రస్తావించబడదు.

ప్రశ్న 1 :—లేత వయస్సులోనే బిడ్డలకు చేతిపనితో పరిచయంచేసే ప్రాతిపదిక విద్యావిధానమువల్ల, బిడ్డల సహజ శక్తి సామర్థ్యముల వికాసమునకు ఆవశ్యకమైన బాల్యస్వేచ్ఛకు భంగము వాటిల్లదా ?

బిడ్డల బుద్ధి వికాసమునకు అవసరమైన శ్రద్ధతీసుకొనకుండా, కేవలం వృత్తి శిక్షణ నివ్వడానికే చేతిపని నేర్పబడుతుందనే పొర పాటు అభిప్రాయమే ఈ భయానికి కారణం. ప్రాతిపదిక విద్యా విధానములో చేతిపనికి స్థానమున్నమాట నిజమేగాని దానికి ప్రాధాన్యమివ్వబడలేదు. బిడ్డలందుండే సహజ కుతూహలేచ్ఛకు, క్రియాకలాపశక్తికి అది (చేతిపని) యివ్వగల అవకాశములకే ఈ విద్యావిధానమునందు ప్రాధాన్య మివ్వబడిందని గ్రహించాలి. బిడ్డల యందు సహజముగావుండే కుతూహలేచ్ఛకూ, క్రియాకలాపశక్తికీ పూర్తిగా న్యాయముచేయగల అవకాశములనివ్వగలందులకై యేదో ఒక చేతిపని ఆధారముగా దానితో సహజమైన పార స్పర్యపు సంబంధముగల అనేక విషయములను సులభముగా అవగత మగునట్లు బోధించడమే ఈ విద్యావిధానపు ఆశయం.

సక్రమముగా నడుపబడే ప్రాతిపదిక విద్యాపాఠశాలయందు విద్య నభ్యసించే బిడ్డలకు తాము యేదో ఒక చేతిపనిని నేర్చుకొను చున్నామనే భావంకలుగదు. చేతిపని వారికి ఒకవిధమైన కాల క్షేపమువంటిదే. బిడ్డల శక్తి సామర్థ్యాలు యేదో ఒక సృజనాత్మక మైన కృషికి వినియోగించబడినంత మాత్రంచేత విద్యాభ్యాసము పట్ల వారికిగల అభిరుచి సన్నగిల్లుతుందనిగానీ, ఉల్లాసము నశిస్తుం దనిగానీ భావించడం పొరబాటు. పైగా స్వేచ్ఛాపూరితమైన వాతావరణంలో తమ సహజశక్తి సామర్థ్యములను పూర్తిగా వ్యక్తముచేసే అవకాశములు వారికనేకము లభించుతవి. ఇంటివద్ద

గానీ, పూర్వపు పద్ధతుల ప్రకారం నడుపబడే ప్రాథమిక పాఠశాల లందుగానీ యిట్టి అవకాశములు లభించవు.

ప్రశ్న 2 :—చేతిపని ఆధారముగాజరిగే విద్యాబోధన వల్ల బిడ్డల అక్షరజ్ఞానము, విద్యావ్యాసంగముల విషయమై అశ్రద్ధ జరిగే ప్రమాదము లేదా ?

విద్య అనగా అక్షరజ్ఞానమనే పొరపాటు అభిప్రాయం తరచుగా కానవస్తున్నది. నిజానికి అక్షరజ్ఞానము విద్యాభ్యాసమున కవసరమైన సాధనములందొకటిమాత్రమే. కాగా, ప్రాతిపదిక విద్యావిధానంవల్ల అక్షరజ్ఞానము విషయమైగానీ, విద్యావ్యాసంగము విషయమైగానీ ఈషణ్మాత్రమైనా అశ్రద్ధజరుగదు.

ఈ విద్యావిధానమువల్ల బిడ్డలు చురుకుగా అక్షరజ్ఞానమును పొందగలరు. పైగా, తిరిగి వారు నిరక్షరాస్యులు గాకుండా ఈ విధానము తగిన జాగ్రత్త తీసికొంటుంది. గాంధీజీ రూపొందించిన విద్యాపథకమునందు అక్షరజ్ఞానమునకు ప్రత్యేకస్థాన మివ్వబడింది. గాంధీజీ అన్నట్లు "ప్రాతిపదిక విద్యాపాఠశాలయందు విద్య నభ్యసించే బిడ్డలు ఒకప్రక్క చేతిపనియందు చురుకుగా పాల్గొనుచూ, మరొకప్రక్క చదువనూ, వ్రాయనూ, సామాన్య విజ్ఞానమును సులభముగా అలవరచుకొలగలరు."

ఇక విద్యావ్యాసంగము విషయాన్ని తీసికొందాము. బిడ్డల జ్ఞాపకశక్తిని శ్రమపెట్టేంతగా వివిధవిషయములతో వారి లేత బుద్ధులను నింపడమే విద్యావ్యాసంగమైతే, అట్టి వ్యాసంగముతో ప్రాతిపదిక విద్యకు యెలాంటి సంబంధమూ లేదు. ప్రాతిపదిక విద్యావిధానమునందు చేతిపనుల ఆధారముగా బిడ్డలకు ఉత్సాహము కల్గించే అనేక విషయములను బోధించవచ్చును. కదురుతో దారము తీయుటను నేర్పునపుడు, యూక్లిడ్ (సుప్రసిద్ధ రేఖా గణిత శాస్త్రజ్ఞుడు) పేరును ప్రస్తావించకుండా కదురు బిళ్ల ఆధార

ముగా వృత్తమునకు సంబంధించిన విషయముల నన్నింటినీ బోధించ వీలున్నదని గాంధీజీ ఒక పర్యాయ మన్నారు. ఇదే విధముగా మరే యితర చేతిపనినైనా నేర్పునపుడు దానితో సహజమైన పార స్పర్య సంబంధముగల, బిడ్డలకు ఉత్సాహము కలిగించే అనేక విషయాలను బోధించ వీలున్నది. ఈవిధమైన బోధనాపద్ధతి వల్ల బిడ్డల కుతూహలమునకు, క్రియాకలాపశక్తికీ పూర్తిగా న్యాయము జరుగుటతోపాటు, వారి మానసిక దృక్పథము విశాలమై, శాస్త్ర యుక్తమై, యితరవిషయములనసేకం వారు సులభముగా అవగా హన చేసికొనగలరు. ప్రాతిపదిక విద్యాపథకము రూపొందించ బడినప్పటినుండి ప్రవీణులైన ఉపాధ్యాయులు కొందరు చేతి పనులకు, విద్యావ్యాసంగమునకు సహజమైన పారస్పర్య సంబంధ ములుగల చక్కని పాఠముల ననేకం తయారుచేశారు.

**ప్రశ్న 3 :—చరిత్ర, విజ్ఞానశాస్త్రము, గణితశాస్త్రముల వంటి పాఠ్యవిషయములను చేతిపనుల ఆధారముగా యెట్లు బోధించ వీలున్నది ?**

పారస్పర్యపు పద్ధతిననుసరించనిదే ప్రాతిపదిక విద్యా విధానం జయప్రదము కాజాలదు. మన భౌతిక, సాంఘిక పరిసర ముల మధ్య సహజమైన సమన్వయము చేతిపని ద్వారానే సాధించ బడగలదనే సత్యమే ఈ పద్ధతికి ప్రాణాధారము. ప్రకృతి, మానవు లకు ప్రసాదించిన ముడి సాధన సంపదలనుండి మానవుడు తన నిత్యజీవితావసర వస్తువులననేకం సృష్టించగలుగుతున్నాడంటే, అది చేతిపనులద్వారానేగదా! ప్రకృతిపై ఆధిపత్యము సంపా దించాలనే ఆకాంక్షతో మానవులు సముపార్జించిన విషయపరి జ్ఞానముయొక్క వివిధశాఖలే విజ్ఞానశాస్త్రం, గణితశాస్త్రం, భూగోళశాస్త్రం మొదలగునవి. నూలువడకుటను నేర్పుతూ భూగోళశాస్త్రము, చరిత్ర మొదలగునవి బోధించడం అందరూ

భావించునంతగా ప్రయాసతో కూడుకున్న విషయం కాదు. నూలు వడకుటను నేర్పుతూ, ప్రత్తి ఏ ప్రాంతములందు పండుతుందో, దానికి యెటువంటి వాతావరణము అవసరమో, అది యెన్ని రక ములో, ప్రత్తినుండి నూలు, నూలునుండి దుస్తులు యెలా తయారు చేయబడుతవో, దుస్తులధారణయందు చరిత్రలో యెన్ని మార్పులు వచ్చినవో మొదలగు విషయములను సులభముగా, బిడ్డల జ్ఞాపక శక్తికి శ్రమ కలిగించకుండా, వారి ఉత్సాహము సడలకుండా బోధించవచ్చును. పాఠ్యపుస్తకాల సహాయంతో ఈ విషయాలన్నింటినీ బోధించడంకన్న, యేదో ఒక పని ఆధారంగా దానితో సహజమైన సంబంధం గల విషయాలను బోధించడం సులభమే గాకుండా దానివలన బిడ్డల ఉత్సాహశక్తి, జ్ఞాపకశక్తీ పెంపొందుతవి.

బిడ్డలు తాము వడకిన దారము నిడివి యెంతో కొలవడం, ఈరోజు తీయబడిన దారమును, క్రిందటిరోజు తీయబడిన దారముతో పోల్చడం మొదలగు విషయములద్వారా గణితశాస్త్రపు మూలసూత్రములను నేర్చుకొనవచ్చును.

ప్రాతిపదిక విద్యాబోధనకు కొన్ని చేతిపనులు మాత్రమే అన్నివిధములా అనుగుణమైనవన్న విషయం సుస్పష్టమే. బోధనావకాశముల దృష్ట్యా అన్నివిధములా తగిన చేతిపనులే ఈ విధానము కొరకు యెన్నిక చేయబడుతవి.

మన పరిసరములనుగురించి, జీవితములో వానికిగల ప్రాముఖ్యతనుగురించి తెలిసికొనడానికి పారస్పర్యపు పద్ధతి యెంతైనా సహజమైనది. ఈ పద్ధతి ప్రకారం విద్యనభ్యసించే బిడ్డలు నూతన విషయపరిజ్ఞానముతోబాటు అభ్యాససిద్ధమైన అనుభవమునుగూడ పొందగలిగి, తద్వారా విద్యాభ్యాసముపట్ల వారికిగల ఉత్సాహము యితోధికము కాగలదు.

ప్రాతిపదిక విద్యావిధానమునందు చేతిపనులతోబాటు, భౌతిక, సాంఘిక పరిసరములకుగూడ తగిన ప్రాముఖ్యత వున్నది.

ఈ రెంటి ఆధారముగా బిడ్డలకు అనేక విషయములను బోధించ వీలున్నది. మంచి తర్ఫీదు పొందిన ప్రాతిపదిక విద్యాబోధకు డెవడైనా వర్షపాతము. ఉరుములు. మెఱుపులు, గ్రహచలనము మొదలైన ప్రకృతి విషయములను గురించి బోధించుతూ బిడ్డల పరిశీలనాశక్తిని, కుతూహలేచ్ఛను పెంపొందించగలడు. వీని ఆధారముగా భూగోళశాస్త్రము, విజ్ఞానశాస్త్రములను బోధించవచ్చును. బిడ్డలు నిత్యమూ చూస్తూవుండే స్థానికభవనములు, పురాతన స్మారకచిహ్నములను గురించి చెప్పుతూ వారికి స్థానిక చరిత్రను బోధించవచ్చును.

ఇక ప్రతియేటా వచ్చే పండుగలు, ఉత్సవములు, తిరునాళ్లు మొదలగు సాంఘిక వేడుకలను గురించి బోధించునపుడు, వీనితో సహజమైన పారస్పర్య సంబంధముగలిగిన, బిడ్డలకు ఉత్సాహమును కలిగించే అనేక విషయములను బోధించవచ్చును.

కవిత్వము, లలితకళలవంటి రసజ్ఞాన విద్యలను చేతిపనుల ఆధారముగా బోధించ వీలున్నదని యెవరూ అనరు. అయితే పైన ప్రస్తావించబడిన భౌతిక, సాంఘిక పరిసరముల ఆధారముగా మరి కొంత ఊహాశక్తిని వినియోగించి బిడ్డలందు సౌందర్య జ్ఞానమును పెంపొందింపజేయవచ్చును.

**ప్రశ్న 4 :— బిడ్డలయొక్క సర్వతోముఖ, పరిపూర్ణ వికాసమే ప్రాతిపదిక విద్యావిధానపు ప్రాథమిక లక్ష్యమని అంగీకరించబడినదనుకొందాము. మరి, ఈ విధానప్రకారము విద్యనభ్యసించే బిడ్డల అభివృద్ధినీ, వారి ప్రత్యేక అభిరుచులను ఉపాధ్యాయులు యేవిధముగా నిర్ణయించగలరు?**

బిడ్డల పరిశీలనాశక్తీ, చేతినైపుణ్యమూ క్రమంగా తర్ఫీదు పొందినకొలదీ వారి యేకాగ్రత, సృజనాత్మకమైన ఊహాశక్తీ, వివేకముకూడ క్రమంగా అభివృద్ధి చెందుతవి. వారి సహజశక్తి

సామర్థ్యముల పరిపూర్ణ వికాసమునకు కృషిచేసే విద్యావిధాన మందు వారి అభివృద్ధిని నిర్ణయించడానికి, పూర్వకాలపు పరీక్షల పద్ధతులుగానీ, మరే యితర సామాన్య పద్ధతులుగానీ పనికిరావు.

ప్రాతిపదిక విద్యాపాఠశాలయందు జరిగే వివిధ కార్యకలాపములే, ఉపాధ్యాయుడు బిడ్డల అభివృద్ధినీ, వారి ప్రత్యేక అభిరుచులనూ నిర్ణయించడానికి తోడ్పడుతవి. పాఠశాలలో జరిగే ప్రతి కలాపమందు ప్రత్యక్షముగా పాల్గొనే అవకాశములు విరివిగా లభించుతవి గాబట్టి బిడ్డలు పదిమందితో కలసి పనిచేసే సహకార గుణమును అలవరచుకొని, నాయకత్వపు బాధ్యతలందు ప్రాథమిక తర్ఫీదునుకూడ పొందగలరు. అంతేకాదు; ఆరోగ్యవంతమైన, క్రమశిక్షణాబద్ధమైన జీవితమును గడుపుటెట్లో వారు తెలిసికొనగలరు.

ఇట్టి విద్యావిధానమునందు బిడ్డల అభివృద్ధిని నిర్ణయించడానికి ఉపాధ్యాయునకు గాఢమైన ఊహాశక్తి, పరిశీలనాశక్తి వుండవలయునని ప్రత్యేకించి చెప్పనవసరంలేదు. బిడ్డల అభివృద్ధిని నిర్ణయించడానికి, అతను వారి రికార్డులను, మేధాశక్తినీ, నిర్వహణా సామర్థ్యమును, కళాభిరుచినీ, అలవాట్లను, సాంఘిక పరిసరములను, స్వయంసహాయశక్తినీ, క్రమముతప్పకుండా హాజరగుచున్నదీ లేనిదీ మొదలగు విషయాలను దృష్టిలోకి తీసుకొని నిర్ణయించవలసి వుంటుంది. వీటన్నింటి దృష్ట్యా బిడ్డలందు భావి పౌరులకుండవలసిన లక్షణములున్నవీ లేనిదీ, ప్రజాసేవపట్ల వారికి అభిరుచివున్నదీ లేనిదీకూడ ఆయన పరిశీలించవలసి వుంటుంది.

**ప్రశ్న 5 :—ప్రాతిపదిక విద్యావిధానం స్వయంపోషకమై యుండాలనేది, డాక్టర్ జకీర్ హుస్సేన్ సంఘము చేసిన సిఫార్సులందు ఒకటి. దీని విషయమై ప్రత్యేకశ్రద్ధ తీసుకొనబడితే బిడ్డల విద్యాప్రయోజనములకు భంగము కలుగదా ?**

గాంధీజీ ప్రాతిపదిక విద్యావిధానము విషయమై పట్టుపట్టి నప్పటినుండీ ఈ విధానపు భవిష్యత్తునుగురించి తర్జన భర్జనలు జరుగుతూనే వున్నాయి. ప్రాతిపదికవిద్యా విధానము జయప్రద మైనదనడానికి అది స్వయంపోషకము కావడమే గీటురాయి అని గాంధీజీ భావించారు. ఈ విధానము స్వయంపోషకమైనదంటె బిడ్డలు తమ మేధాశక్తి, సామర్థ్యములను సక్రమముగా వినియోగించగలుగుతున్నారని మనము భావించ వచ్చునని గాంధీజీ అభిప్రాయపడ్డారు.

ప్రాతిపదిక విద్యావిధానము మొట్టమొదటిసారిగా ప్రవేశ పెట్టబడినపుడు అది కొంతవరకైనా స్వయంపోషకము కాగలిగి యుండాలనీ, లేకపోతే భారతదేశమువంటి పేద దేశమునందు ఈ విద్యావిధానమును భారీయెత్తున ప్రవేశపెట్టడం సాధ్యముకాదనీ గాంధీజీ గుర్తించారు. కేంద్ర విద్యాసలహా సంఘముకూడా ఈ విద్యావిధానమునకు సంబంధించిన ఆర్థికాది విషయములనన్నింటినీ పరిశీలించి, గాంధీజీ అభిప్రాయము సత్యదూరము కాదని తన నివేదికయందు స్పష్టము చేసింది.

అయినా, భారత ప్రభుత్వము వార్ధా పథకమును యథా తథముగా ఆమోదించలేదు; కేంద్ర విద్యా సలహా సంఘపు సిఫార్సు లను మాత్రం స్థూలముగా ఆమోదించింది. ప్రాతిపదిక విద్యా విధానము కొంతవరకైనా ఆర్థికముగా స్వయంపోషకమై యుండ వలసిన ఆవశ్యకత గుర్తించబడినంతమాత్రంచేత దాని విషయమై పట్టుదల వున్నదని భావించవలసిన పనిలేదు. కేంద్ర విద్యా సలహా సంఘముకూడ ఈ విషయమై అంతగా పట్టుదల చూపలేదు.

ఏది ఏమైనా వున్నా, ప్రాతిపదిక విద్యావిధానము స్వయం పోషకమై యుండాలనే అభిప్రాయమువలన బిడ్డల విద్యాప్రయోజన ములకు భంగము వాటిల్లదు సరిగదా, దానివలన వారియందొక విధమైన బాధ్యతాయుత ప్రవృత్తి పెంపొందగలదు. అంతేగాదు;

ఇట్టి అభిప్రాయమువలన విద్యార్థులు, ఉపాధ్యాయులు తమ పని పాటులందు యిత్తోధికమైన నైపుణ్యముతో వ్యవహరిస్తూ, వస్తువులందు పంతుగ సంభవించకుండా జాగ్రత్త వహిస్తూ తద్వారా నాణ్యమైన వస్తూత్పత్తికి తోడ్పడగలరు.

ప్రశ్న 6 :—ప్రాతిపదిక విద్యాపాఠశాలలందు తయారు కాబడే వస్తువులలో అధికభాగం అమ్ముడుపోయే అవకాశములు తక్కువగదా ! ఈ విషయము దృష్ట్యా ఈ విద్యావిధానము దండుగ ఖాయిష్టమైనదీ, ఆర్థికముగా నష్టదాయకమైనదీ కాదా?

ప్రాతిపదిక విద్యావిధానమును ఆర్థికాది విషయముల దృష్ట్యానే పరిశీలించితే ప్రారంభములో కొంతైనా దండుగ సంభవించక తప్పదని విశదమౌతుంది. అయితే అనుభవజ్ఞుడైన ఉపాధ్యాయుడెవడైనా ఈ దండుగను సాధ్యమైనంతవరకు తగ్గించ వచ్చును. ప్రాతిపదిక విద్యాపాఠశాలలందు విద్యార్థులచే తయారు చేయబడే వస్తువులేవైనా, యితర చేతిపని వస్తువులవలెనే, ఫ్యాక్టరీ తయారీవస్తువులకన్న ఖరీదెక్కువగా వుండడం సహజం. చేతిపని వస్తువుల అమ్మకమును ప్రోత్సహించడం, ప్రభుత్వ విధానములం దొకటి. కాబట్టి వీని అమ్మకం విషయమై అంతగా కష్టపడ వలసిన అవసరం వుండక పోవచ్చును. పైగా ఈ వస్తువులందు అధికభాగము ఉపాధ్యాయులు, విద్యార్థుల తల్లిదండ్రులు, స్థానిక ప్రజలే సరసమైన ధరలకు కొనగలరని ఆశించవచ్చును.

ప్రాతిపదిక విద్యావిధానము ప్రవేశపెట్టబడిన మొదటి రెండు, మూడు సం॥లలో సంభవించే నష్టమును క్రమక్రమముగా తగ్గించ వీలున్నది. ఉదాహరణకు, కొన్ని పాఠశాలలందు తయారు చేయబడిన గుడ్డ ప్రారంభములో అనుభవము లేమివల్ల ముతకగా తయారైన కారణంగా అమ్మకమందు కొంత యిబ్బంది కలిగి నప్పటికీ, క్రమక్రమముగా దీని నాణ్యత పెంపొందినకొలదీ సులభము

గానే అమ్ముడు పోసాగినది. ఈ పాఠశాలల నిర్వహణ సంఘములు తమ కవసరమైన వస్తుసామగ్రిని సాధ్యమైనంతవరకూ పాఠశాలలందు తయారైన వస్తువులనుండేకొని, మిగతా సంస్థలకు ఈవిషయంలో మార్గదర్శకములైనవి. కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలైతే ఈ పాఠశాలలలందు ఉత్పత్తిచేయబడే వస్తువులకు ప్రమాణాలను నిర్ణయించినవి.

విశాలమైన దృక్పథముతో పరిశీలించితే ప్రాతిపదిక విద్యావిధానము దండుగ భూయిష్టమైనది కావనీ, పైగా పూర్వపు విద్యావిధానమువల్ల సంభవిస్తున్న దండుగలను యిది నివారించగలదనీ విశదముకాగలదు. గాంధీజీ అన్నట్లు "ప్రాథమిక విద్యావిధానముపై ఖర్చుపెట్టబడే సొమ్ము దండుగ అవుతున్నది. ఎందువల్లనంటే, ప్రాథమిక పాఠశాలలందు బిడ్డలు నేర్చుకొనగలిగేది బహుస్వల్పం. ఆ స్వల్పమైనా అచిరకాలముననే మరచిపోవడం జరుగుచున్నది. పైగా దీనివల్ల అటు పల్లెలకుగానీ, యిటు పట్టణాలకుగానీ ఈషణ్మాత్రమైనా లాభము కలగడంలేదు." ప్రాతిపదిక విద్యావిధానమువల్ల ఈ లోపములన్నీ నివారింపబడగలవనుటకేమాత్రం సందేహంలేదు. విషయపరిజ్ఞానముతో బాటు సృజనాత్మకమైన కార్యకలాపశక్తిని వికసింపజేయగల విద్యా విధానమే బిడ్డలకూ, తద్వారా మన దేశమునకూ అన్ని విధములా అనుగుణమైనది. ఈ విషయాలన్నిటి దృష్ట్యా, ప్రాతిపదిక విద్యావిధానమువల్ల డబ్బు దండుగ నివారింపబడుటతోబాటు, మన బిడ్డల కార్యకలాపశక్తి వృథాకాకుండా సద్వినియోగము కాగలదని స్పష్టమగుచున్నది.

ప్రాతిపదిక విద్యాపథకము ప్రధానముగా విద్యాపథకమేనని, వస్తూత్పత్తి దీని లక్ష్యముగాదని, దీనిని కూలంకషగా పరిశీలించిన శ్రీ జి. బి. ఖేర్ సంఘము స్పష్టముచేసినది. విజ్ఞులనేకుల ఆమోదము పొందిన ఈ పథకమును భారీయెత్తున ప్రవేశపెట్టడానికి

ఆచరణ సంబంధమైన చిక్కులను, ఆర్థిక సంబంధమైన ఇబ్బందులను యెదుర్కొనవలసిరావచ్చును. అంతమాత్రంచేత మనము జంకి ప్రయోజనములేదు. దేశ శ్రేయస్సుదృష్ట్యా ప్రయోజకులు, సుశిక్షితులూ అయిన స్త్రీ, పురుషులను తయారుచేయగల ఈ విద్యా విధానమును జయప్రదముగా అమలు జరుపడానికి దీర్ఘకాల కృషి, పెట్టుబడి అవసరం.

**ప్రశ్న 7 :— ప్రాతిపదిక విద్యావిధానము, బిడ్డలను వారు జన్మించిన వాతావరణముననే ముడిపెట్టి, తద్వారా వృత్తి స్వాతంత్ర్యమునకు, సమానావకాశవాదమునకు భంగము కలిగించదా ?**

బిడ్డ జన్మించిన వాతావరణమునకు తగిన ప్రాముఖ్యమివ్వని యే విద్యావిధానమైనా సమగ్రమైనది కాజాలదు. బిడ్డ తానుజన్మించిన వాతావరణముతో సహజమైన సంబంధముగల విషయములను ఉత్సాహముతో, సులభముగా నేర్చుకొనగలడు. అందువల్లనే ప్రాతిపదిక విద్యావిధానం వాతావరణమునకు తగిన ప్రాముఖ్యమిస్తున్నది. ఇంతమాత్రంచేత ఈ విద్యావిధానము, బిడ్డలను వారు జన్మించిన వాతావరణముననే ముడిపెట్టుతుందని భావించడం పొరపాటు.

గాంధీజీ ఒక పర్యాయమన్నట్లు ప్రాతిపదిక విద్యా విధానము యొక్క అంతిమలక్ష్యములందు, "కలవారు, లేనివారు అనే అసహజమైన విభజనలేని, ప్రతివ్యక్తికీ తగుమాత్రము జీవనోపాధి లభించే అవకాశములుగల, న్యాయసమ్మతమైన సాంఘిక వ్యవస్థను దేశంలో అవతరింపజేయడ" మొకటి. బిడ్డ జన్మించిన వాతావరణముకు తగినస్థాన మివ్వకుండా, కేవలం పుస్తకపఠనముతోనే సరిపుచ్చే విద్యావిధానమువల్ల బిడ్డల క్రియాకలాపశక్తి

క్షీణించిపోతుంది. ఇట్టి విధాన ప్రకారము విద్య నభ్యసించే వారు సర్వతోముఖ వికాసమును పొందజాలరు.

నూలువడకుట, నేతపని మొదలగు చేతిపనులను నేర్చుకొన్నంతమాత్రముచేత బిడ్డలు తమ భావిజీవితములో వానినే జీవన వృత్తులుగా స్వీకరిస్తారని భావించరాదు. చేతిపని ఆధారముగా వారు తమ మేధాసంపత్తిని, క్రియాకలాపశక్తితో చక్కగా సమన్వయపరచగలిగి, భావి జీవితములో తాము యెట్టి వృత్తిని స్వీకరించినా జయప్రదముగా నిర్వహించగలరు.

కేవలం పుస్తక బాహుళ్యమునకు, ఇంగ్లీషు భాషాజ్ఞానమునకు మితిమీరిన ప్రాముఖ్యమిస్తున్న నేటి విద్యావిధానమువల్ల ఉన్నత విద్యావంతుల సంఖ్య బహుస్వల్పమై, వారికీ తక్కిన సామాన్య ప్రజానీకమునకూ మధ్యగల క్రొద్దిపాటి సంబంధము నశించిపోయి, మన సాంఘిక వ్యవస్థలో అసహజమైన పరిస్థితులు యేర్పడుతున్నాయి. ప్రస్తుత విద్యావిధానము ఫలితముగా కాయకష్టమును అగౌరవదృష్టితో యేవగించుకొనే వర్గ మొకటి తయారైనది. కాయకష్టపు ఘనతను, సాంఘికన్యాయమును పూర్తిగా గుర్తించిన ప్రాతిపదిక విద్యావిధానము సమాజమునకు హాని కలిగించే దుష్టశక్తులనన్నింటినీ తొలగించగలదనుట కేమాత్రమూ సందేహము లేదు.

ప్రాతిపదిక విద్యాపథకము మొదట రూపొందించబడింది, ప్రధానముగా గ్రామీణ ప్రాంతములకొరకేనన్నమాట నిజమే. అయితే అంతమాత్రంచేత ఈ విద్యావిధానము పట్టణ ప్రాంతములకు పనికిరాదని భావించరాదు. ఈ విద్యావిధానమును అమలు జరుప భారత ప్రభుత్వము అంగీకరించినదంటే దానికి కారణం, ఇది అటు గ్రామీణ ప్రాంతములకు, యిటు పట్టణ ప్రాంతములకు పూర్తిగా అనుగుణమైనదని ఋజువైనందువల్లనే. ప్రాతిపదిక

విద్యావిధానపు ప్రధాన సూత్రాలు పట్టణ ప్రాంతపు పాఠశాలలకు కూడా పూర్తిగా అనుసరణీయములే. ఈ విద్యావిధానం యేదో ఒక చేతిపని ఆధారముగా సాగినంతమాత్రముచేత బిడ్డలు అదే చేతిపనిని తమ వృత్తిగా స్వీకరించాలనే నిర్దేశన యేమీ లేదు.

ప్రాతిపదిక విద్యావిధానం, యెట్టి విచక్షణ లేకుండా, దేశ మందలి బాలబాలికలందరికొరకు వుద్దేశింపబడిన విస్తృత విద్యావిధానం. సాంఘిక సేవాతత్పరతకు, కాయకష్ట గౌరవమునకు ప్రాముఖ్యమిచ్చే ఈ విద్యావిధానము "ప్రజాస్వామిక, సాంఘిక వ్యవస్థకు అన్నివిధములా అనుగుణమైన సహజ విద్యావిధాన"మని విజ్ఞులనేకులు నొక్కి వక్కాణించియున్నారు.

ప్రశ్న 8:—ప్రాతిపదిక విద్యను మాధ్యమిక, ఉన్నత (విశ్వవిద్యాలయ) విద్యలతో సరిగా సమన్వయపరచకుండా భారీయెత్తున దీనిని ప్రవేశపెట్టడంవల్ల మన విద్యావిధానమందు తీవ్రమైన కొరత యేర్పడదా?

గాంధీజీ ప్రాతిపదికవిద్యను ప్రాథమికవిద్యస్థానే ప్రవేశపెట్టదగిన విద్యగానే పరిగణించలేదు; మన యావత్తు విద్యావిధానమును పునర్నిర్మించాలనే ఆశయంతో, తొలిదశగా ప్రాతిపదిక విద్యావిధానమును ప్రవేశపెట్టవలయునని ఆయన భావించారు. "జాతీయ అవసరాలకు అనుగుణంగా మన ఉన్నతవిద్యావిధానము మార్పు చెందాలి" అన్నారొకసారి గాంధీజీ. ఇంగ్లీషుభాషకు విశేష ప్రాధాన్యమిస్తూ, పాఠ్యవిషయములను ఇంగ్లీషుద్వారానే బోధించే మాధ్యమికవిద్య దీర్ఘకాలము (7 సం॥) కొనసాగడం అనవసరమనీ, మాతృభాషద్వారా బోధన జరిగితే విద్యార్థులు సులువుగా అచిరకాలములోనే ఈ విద్యను పూర్తిచేయగలరనీ ఆయన విశ్వసించారు. మన దేశపు విద్యావసరాలదృష్ట్యా మాధ్యమికవిద్యావిధానము ఆయనకొక ప్రతిబంధకముగా తోచిందంటే ఆశ్చర్యములేదు.

మాధ్యమిక విద్యావిధానమునందు చేతిపనులకు, వృత్తివిద్యలకు యెట్టి ప్రాముఖ్యమూ లేనందువల్ల, విద్యార్థుల సహజ క్రియాకలాపశక్తి వికసించే అవకాశములు శూన్యం. పైగా దీనివల్ల విద్యార్థులందు కాయకష్టముపట్ల అగౌరవభావము, పుస్తకవిజ్ఞానమే సంస్కృతీ, సభ్యతలకు మూలాధారమనే కుతర్కభావములు ప్రబలినాయి. మన జాతీయ జీవన వికాసమునకు దోహదంచేయని ఈ విద్యావిధానము యెంత త్వరగా తొలగించబడితే అంత మంచిది. దీనిస్థానే దేశావసరములకు అన్నివిధములా అనుగుణమైనదీ, విద్యార్థుల సర్వతోముఖవికాసమునకు దోహదంచేయగలదీ అయిన విద్యావిధానం ప్రవేశపెట్టబడాలి.

ప్రాతిపదికవిద్య ప్రారంభములో ఒక ప్రత్యేకదశకే పరిమితం చేయబడడానికి ముఖ్యకారణం, మిగతా దశలందు దీనిని ప్రవేశపెట్టడానికి అవసరమైన సాధన సంపదల లేమియే కాని మరేమీకాదు. ప్రాథమికవిద్యస్థానే ప్రవేశపెట్టబడిన ఈ విద్యావిధానము క్రమముగా యితర దశలకు కూడా వ్యాప్తిచేయబడగలదు. ప్రాతిపదికవిద్యను, మాధ్యమిక, ఉన్నతవిద్యలతో సమన్వయపరచే విషయమై యిదివరకే కొంత కృషి జరిగింది. 1939 సం॥ లో కేంద్ర విద్యా సలహా సంఘము, ప్రత్యేక సంఘము నొకదానిని నియమించి, ప్రాతిపదికవిద్యను ఉన్నతవిద్యలతో సమన్వయపరచు విషయమై పరిశీలించవలసినదిగా విజ్ఞప్తి చేసింది. సంఘమీ విషయమై పరిశీలనలు జరిపి సమర్పించిన నివేదికలో, ప్రాతిపదికవిద్య యెనిమిది సంవత్సరములపాటు కొనసాగవలయునని, దీనిలో మొదటి 5 సంవత్సరములు "జూనియర్" దశగాను, తరువాతి 3 సంవత్సరములు "సీనియర్" దశగానూ పరిగణింపబడాలని సిఫారసు చేసింది.

తరువాత 1952 సంవత్సరములో భారత ప్రభుత్వము మరియొక కమిషన్‌ను నియమించి, మాధ్యమిక విద్యావిధానమునకు

సంబంధించిన వివిధ అంశములను పరిశీలించి, దానిని ప్రాతిపదిక, ఉన్నతవిద్యలతో సమన్వయపరచు నిమిత్తం తగిన సూచనలను చేయవలసిందని విజ్ఞప్తి చేసింది. ఈ కమీషన్ తగు పరిశీలనలను జరిపి, ప్రాతిపదికవిద్యలో "సీనియర్" దశ పాఠ్యవిషయప్రమాణము, మిడిల్, లోయర్ సెకండరీ పాఠశాలల పాఠ్యవిషయ ప్రమాణములు సాధ్యమైనంతవరకూ ఒకేవిధముగా వుండవలయుననీ; ప్రాథమికవిద్యాదశ లేక దానితో సరితూగు జూనియర్ ప్రాతిపదికవిద్యాదశ తరువాత ప్రారంభమయ్యే మాధ్యమిక విద్యాదశలోని మొదటి మూడుసంవత్సరములు "సీనియర్" ప్రాతిపదిక విద్యాదశ లేక జూనియర్ మాధ్యమికదశలకు సమానంగా పరిగణింపబడాలనీ, తరువాత 4 సంవత్సరములు "హయ్యరుసెకండరీ" విద్యగా పరిగణింపబడాలనీ సిఫారసు చేసింది. 11 సంవత్సరములు మొదలు 14 సంవత్సరములవరకూ వయస్సుగల బిడ్డల విద్యార్థిదశలో ప్రాతిపదిక విద్యావిధానపు ముఖ్యసూత్రాలను అమలు జరుపవలసిన ఆవశ్యకతనుగురించి ఈ కమీషన్ నొక్కి వక్కాణించినది.

ప్రాతిపదిక మాధ్యమిక విద్యల మధ్య "తెంపు" అనేది లేకుండా జాగ్రతవహించాలనీ, ప్రాతిపదిక విద్యను పూర్తిచేసిన విద్యార్థుల అభిరుచులకు, శక్తిసామర్థ్యములకు అనుగుణముగా మాధ్యమిక పాఠశాలలందు పాఠ్యవిషయ వైవిధ్యతకు ప్రాముఖ్యమివ్వబడటం యెంతైనా అవసరమనీ కమీషన్ అభిప్రాయపడింది. మాధ్యమిక పాఠశాలలందు సామాన్య పాఠ్యవిషయములతోబాటు, వృత్తి విద్యలకుకూడ తగిన సౌకర్యములుండాలనీ, ప్రాతిపదిక విద్యను పూర్తిచేసిన విద్యార్థులు వీనిలో యేదో ఒకదానిని యెన్నుకొనే స్వేచ్ఛను కలిగి యుండాలని కూడా కమీషన్ సిఫార్సు చేసింది. మాధ్యమిక విద్యలో చేతిపనులు నిర్బంధ విషయములుగా ప్రవేశపెట్టబడితేనేగాని, ప్రాతిపదిక, మాధ్యమిక విద్యా

దశలమధ్య సహజమైన సమన్వయమేర్పడదని కమీషన్ అభిప్రాయపడింది.

పాఠ్యవిషయ వైవిధ్యత, చేతిపనులు, సాంకేతిక తర్ఫీదుల విషయమై ప్రత్యేక శ్రద్ధతీసుకోనబడితే, ప్రాతిపదిక, మాధ్యమిక విద్యలమధ్య యింతవరకూ వుంటూవచ్చిన వ్యత్యాసము తొలగిపోయి, సహజమైన సమన్వయమేర్పడగలదని ఆశించవచ్చును.

ప్రశ్న 9:—తర్ఫీదు పొందిన ప్రాతిపదిక విద్యాబోధకుల కొరత మిక్కుటముగా వున్నది గదా! ఈ విషయము దృష్ట్యా భారీ యెత్తున ప్రాథమికవిద్యనుండి ప్రాతిపదిక విద్యకు మార్చడం సాధ్యమేనా?

భారీయెత్తున ప్రాథమిక విద్యస్థానే ప్రాతిపదిక విద్యను ప్రవేశపెట్టడానికి అవసరమైన బోధనా సిబ్బంది కొరత మిక్కుటముగానున్నమాట నిజమే. క్రొత్తగా యెట్టి ఉద్యమాన్ని ప్రారంభించినా కొన్నియిబ్బందులను యెదుర్కొనవలసి యుంటుంది. ఇవి తాత్కాలిక ప్రతిబంధకాలేకాని శాశ్వతమైనవి కావన్న విషయం మనం గ్రహించాలి. తగిన ఉద్యోగాలు దొరకనందువల్ల వృధాగా కాలక్షేపంచేస్తున్న మెట్రిక్యులేట్లు, ఇంటర్‌మీడియేట్లు అనేకులు వున్నారీ రోజుల్లో. వీరిలో ఉపాధ్యాయవృత్తిపట్ల అభిరుచి, ప్రాతిపదిక విద్యపట్ల అభిమానముగల వారికి తగిన తర్ఫీదునిచ్చి, ప్రాతిపదిక విద్యాసిబ్బంది కొరతను చాలవరకు తగ్గించవచ్చును.

ప్రాతిపదిక విద్యాబోధకులకు ప్రత్యేకమైన తర్ఫీదు శిక్షణలు అవసరమనీ, వీనికి తగిన యేర్పాట్లు చేయబడితేనేగాని ఈ విద్యావిధానము జయప్రదము కాజాలదనీ ప్రభుత్వము గుర్తించి, ప్రాతిపదిక విద్యాబోధకులకు తర్ఫీదునిచ్చునిమిత్తం ఢిల్లీనగర

మందలి జామియా మిలియా, శాంతినికేతన్‌లోని వినయభవన్ లకు 1946-47 లగాయతూ గ్రాంటులనిస్తూన్నది. తర్ఫీదుకాలము ఒక సంవత్సరము మాత్రమే. ఈ సంవత్సరకాలములో విద్యావిషయిక సిద్ధాంతములు, చేతిపనులు, అభ్యాసపూర్వకమైన బోధన మొదలగు విషయములందు సమగ్రమైన తర్ఫీదు యివ్వబడుతుంది.

---

ప్రథమ పంచవర్ష ప్రణాళిక క్రింద దేశమందలి రాష్ట్రాలన్నింటిలో "పోస్టుగ్రాడ్యుయేట్" తర్ఫీదు కళాశాల ఒకటి, ఒక ప్రాతిపదిక విద్యాపాఠశాల, ఒక సీనియర్ ప్రాతిపదిక పాఠశాలలను ప్రారంభించడానికి యేర్పాట్లు చేయబడినవి. అనేక రాష్ట్రాలందు ఇదివరకే ఈ తర్ఫీదుసంస్థలు ప్రారంభించబడినవి. ప్రాతిపదిక విద్యావ్యాప్తికొరకు యిటీవలననే రూపొందింపబడిన పథకము క్రింద "కెరియర్" మాస్టర్లు, చేతిపని బోధకులు, ప్రాతిపదిక విద్యాబోధకుల తర్ఫీదు నిమిత్తం మరికొన్ని యేర్పాట్లు చేయబడుచున్నవి. ఈలోగా ప్రస్తుతమున్న ఉపాధ్యాయ తర్ఫీదు పాఠశాలలు. ప్రాతిపదికవిద్యాబోధకుల తర్ఫీదు పాఠశాలలుగా మార్చబడుతున్నాయి. కొన్ని నూతన తర్ఫీదు కళాశాలలుకూడా ప్రారంభించబడుతున్నాయి.

వీటన్నింటితోబాటు రాష్ట్రప్రభుత్వాలు కూడా ప్రాతిపదిక విద్యాబోధకుల తర్ఫీదు నిమిత్తం కొన్ని కార్యక్రమములను అమలు జరుపుచున్నాయి.

**ప్రశ్న 10 :—ప్రాతిపదిక విద్యావిధానము చేతిపనులకు ప్రాముఖ్యమివ్వడంవల్ల, దేశము కుటీరపరిశ్రమల స్థాయిలోనే వుండి తద్వారా పారిశ్రామికాభివృద్ధికి భంగము వాటిల్లదా ?**

అధికమైన జనాభాగలిగి, అన్నివిధములా వెనుకబడియున్న భారతదేశము వంటి దేశము తనకుగల పరిమితమైన సాధన సంపద

లను సక్రమముగా వినియోగించి, సాధ్యమైనంత యెక్కువగా పని పాటులను కల్పించవలయునంటే కుటీర పరిశ్రమలకూ, తదితర చిన్న పరిశ్రమలకూ ప్రత్యేక ప్రాముఖ్యమివ్వక తప్పదు. చేతి పనుల ఆధారముగా విద్యనభ్యసించే బిడ్డలకు, చిన్న చిన్న పరిశ్రమల నిర్వాహణకు సంబంధించిన వివిధములగు అంశములతో తగు పరిచయమేర్పడుతుంది. ఇష్టమైతే భావిలోవారు వీనినే చేపట్టవచ్చును; లేదా తమకు అభిరుచిగల మరే ఇతర వృత్తినైనా స్వీకరింపవచ్చును. ప్రాతిపదిక విద్యావిధానమందలి విశిష్టత యిదియే.

కుటీరపరిశ్రమలు, తదితర చిన్న పరిశ్రమల ప్రమేయము లేకుండా, భారతదేశమును పటిష్టమైన ఆర్థికవ్యవస్థగల ఆధునిక దేశముగా ఊహించే అర్థశాస్త్రవేత్తలెవరూ వుండరు. ప్రాతిపదిక విద్యావిధానం భారతదేశమునకు అన్నివిధములా వాంఛనీయమైన ఆర్థికవ్యవస్థను రూపొందించుటలో యథాశక్తి తోడ్పడగలదు.

సత్వర పారిశ్రామికాభివృద్ధి, గ్రామీణ ఆర్థిక వ్యవస్థ, మొదలగువాని గుణదోషాల నిర్ణయమునకు పోకుండానే, కేవలం పుస్తక బాహుళ్యమునకు ప్రాముఖ్యమిచ్చే విద్యావిధానముకన్న చేతిపనులు, "ప్రాక్టికల్" తర్ఫీదుల ఆధారముగా కొనసాగే విద్యావిధానమే అన్నివిధములా మేలయినదనీ, ప్రవీణులయిన పనివారలను తయారుచేయుటలో ఈ విధానమెంతైనా తోడ్పడగలదనీ ఖండితముగా చెప్పవచ్చును. పారిశ్రామికముగా యెంతగానో అభివృద్ధిగాంచిన అమెరికా, ఇంగ్లండ్, రష్యాలవంటి దేశములందుకూడా ఇట్టి విద్యావిధానపు ప్రాముఖ్యత గుర్తించబడింది. ఈ దేశములందు ప్రారంభించబడిన "ప్రాజెక్టుమెథడ్", "యాక్టివిటీ స్కూల్" మొదలగు ఉద్యమములు యిలాంటివే.

"చేతిపనుల ఆధారముగా విద్యాబోధన" అనే ముఖ్య సూత్రము, మన దేశ విద్యావసరాలకు అన్ని విధములా అనుగుణమైనదని విజ్ఞులనేకులు నొక్కి వక్కాణించియున్నారు. కేవలం పుస్తకపఠనమునకూ, సారస్వత విషయములకూ అధిక ప్రాధాన్యమిచ్చే విద్యావిధానమువల్ల విద్యార్థులందు కృషిపట్ల దురభిప్రాయం కలగడం మినహా మరేమీ లాభము కలుగలేదు. బిడ్డల మేధాశక్తినీ, క్రియాకలాపశక్తితో చక్కగా సమన్వయపరచి "ప్రాక్టికల్" తర్ఫీదుద్వారా వారి పరిశీలనాశక్తినీ, సృజనాత్మకమైన శక్తి సామర్థ్యములనూ వికసింపజేయగల ప్రాతిపదిక విద్యావిధానము, ముందు ముందు సాంకేతిక ప్రవీణులనేకులను తయారుచేసి, తద్వారా పారిశ్రామికాభివృద్ధికికూడా దోహదకారి కాగలదనుటకు ఏమాత్రమూ సందేహము లేదు.

సమాప్తం.



# కొన్ని తెలుగు ప్రచురణలు

**ద్వితీయ పంచవర్ష ప్రణాళిక : సంగ్రహపాఠము**

(ద్వితీయ పంచవర్ష ప్రణాళిక సారాంశము సామాన్యులకు కూడా అవగత మగునట్లు సులభ శైలిలో వ్రాయబడింది. 196 పేజీలు)

వెల : ఒక రూపాయి.

**మన ద్వితీయ పంచవర్ష ప్రణాళిక**

(ద్వితీయ ప్రణాళిక స్వరూపమును సంగ్రహముగా సులభ శైలిలో వివరించే పుస్తకము.) వెల : 6 అణాలు.

**అస్పృశ్యతా నివారణ**

(ప్రముఖుల రేడియో ప్రసంగముల సంగ్రహము.) వెల : 4 అణాలు.

**ప్రజలు : ప్రణాళిక**

(పంచవర్ష ప్రణాళిక నిర్వహణలో ప్రజలకుగల ప్రముఖపాత్ర యెట్టిదో వివరించే పుస్తకము.) వెల : 6 అణాలు.

**ప్రాతిపదికవిద్య : ప్రశ్నోత్తరములు**

(అచ్చులో నున్నది.) వెల : 4 అణాలు

ప్రతులకు దిగువ అడ్రస్సుకు వ్రాయాలి:

పబ్లికేషన్స్ డివిజన్
మినిస్ట్రీ ఆఫ్ ఇన్ఫర్మేషన్ అండ్ బ్రాడ్‌కాస్టింగ్
ఓల్డ్ సెక్రటేరియట్, ఢిల్లీ - 8

PRINTED AT THE JUPITER PRESS PRIVATE LTD., MADRAS 18

